# వెధవ

(అసతో మా సద్గమయ)




శతక రచన

నారుమంచి వేంకట అనంతకృష్ణ

# వెధవ (కడుపుమంట శతకము)

## నారుమంచి వేంకట అనంత కృష్ణ



ప్రథమ ముద్రణ : శార్వరి, మాఘం. 1st April, 2021

వెల : అమూల్యము

ప్రతులకు సంప్రదించండి :

**N.V.Anantha Krishna**
Advocate, Plot No.80, Sri Sai Nagar, Road No.4
Opp.Sri Saibaba Temple, Nagole Post,
Hyderabad 500 068.

Mobile:9246531895
Email: ananthcourt@rediffmail.com

## నేను సైతం నాల్గు మాటలు....!

శ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారు న్యాయ వాది. న్యాయం కోసం వాదించే మంచి మనిషి. అంతకు పూర్వము సామాన్యుడు ఎదగటానికి పందిరిగా నిలిచిన బ్యాంకరు. అవసరంలో ఉన్న వాడిని ఆదుకోవటానికి సదా స్పందించే చల్లటి గుండెకు స్వంతదారు. చక్కని కవి, గొప్ప పండితుడు. తెలుగు, హిందీ, ఇంగ్లీషు, కన్నడం, తమిళం వంటి ఇహలోకపు భాషలతో ఇటు మనుషులతో, చక్కని సంస్కృత భాషా పరిజ్ఞానంతో అటు దేవుళ్ళతో కూడా మాట్లాడి, వాదించి గెలువగల సరుకున్న మేధావి. జ్యోతిష్యం కూడా వచ్చు. కాబట్టి కోర్టు హాలులో ఎవడు అబద్ధం చెబుతున్నాడో, ఎవడు నిజం చెబుతున్నాడో "భగవంతుని మీద ప్రమాణం చేసి చెప్పక పోయినా' ఈయనకు తెలిసిపోతుంది.

ఈయన విద్యా దాత. దానకర్ణుడు. పురాణాల రహస్యాలను విడమర్చి చెప్పగల ప్రవచన కర్త. మంచి మనిషి. 'అమ్మ'కు ప్రియుడైన పుత్రుడు. రోజూ దేవుని ముందర స్తోత్రాలుగా చదువుకోవటానికి అర్హమైన ఎన్నో పద్య శతకాలను వ్రాసిన ఉదాత్తుడైన మహావ్యక్తి. మరి అంతటి మహానుభావుడు ఈ వెధవ శతకం రాయటం ఏమిటి? దానికి కారణం సహవాస దోషమేనని శతకం మొదట వ్రాసిన మొట్టమొదటి పద్యంలో తేటతెల్లం చేసినారు. నిజానికి ఆయన మనసెప్పుడూ సామాజిక సేవకై, సమాజ శ్రేయస్సుకై తహతహలాడుతూ ఉంటుంది. 'ప్రజ-పద్యం' బోయీల్లో ఒకరైనందున ఆయన ప్రతి పద్యంలో సామాజిక స్పృహ తొణికిసలాడుతూ ఉంటుంది. సమాజంలో మైనారిటీ వర్గాల(మంచివాళ్ళు, దేవుళ్ళ) గురించి విస్తారంగా వ్రాసిన అనంతకృష్ణ గారు తాజాగా తన కలాన్ని కత్తిగా మార్చి సమాజంలోని

‘మెజారిటీ(వెధవల) వర్గం’ పైన ఝులిపించటం నిజానికి అసంకల్పిత ప్రతీకార చర్య. వేయి పద్యాలు వ్రాయటానికి అవకాశము, వ్రాయగల సామర్థ్యమూ కల విషయము ఆయన పాలపడింది. ఆయన ఒక్కరోజులో వ్రాసినారా, ఒక్క గంటలో వ్రాసినారా అనేది ప్రక్కన పెడితే, ఆపుకోలేని ఆవేశంతో, ఆవేదనతో ఆగకుండా ఏకబిగిన వ్రాసినారని మాత్రం ఘంటాపథంగా చెప్పగలను.

‘పురుషులందు పుణ్యపురుషులు వేరయా!’ అని వేమన గారు అంటే, వీరు వెధవలను పదకొండు అంశాల ఆధారముగా వివరించినారు. ఈ శతకం వ్రాయుటకు నా ‘పనికిమాలిన పద్యం’ వారిని ప్రేరేపించిందన్నారు. నాపట్ల, నా కవిత్వం పట్ల వారికి వున్న ‘సదభిప్రాయానికి’ గాను వారికి నా శిరస్సు నెత్తి ధన్యవాదములు తెలుపుతున్నాను. అట్లే “నా వెధవ శతకాన్ని చదివి కొందరైనా మారితే నాకు కొండంత భాగ్యం!”అని వారన్నారు. ప్రతి పద్యమూ చదివించేలాగా, చదివిన ప్రతిపద్యమూ ఆలోచింపజేసేలాగా వున్న ఈ శతకం తప్పక సమాజంలో వెధవల సంఖ్యను విపరీతంగా తగ్గిస్తుందని చెప్పటంలో నాకే అనుమానమూ లేదు. “వందపద్యాలను ఏకబిగిన ఎట్లా వ్రాయగలిగినారు సార్?” అంటే వారిచ్చిన జవాబు “అమ్మ దయయె దక్క నన్యమేమి?” వారి ఎంత ఎదిగినా ఒదిగి ఉండే సద్గుణాన్ని, సౌజన్యాన్ని తెలుపుతున్నది.

‘తీగ పెరుగు కొరకు తీరుగా దారమ్ము కట్టినట్లు’ అని తల్లిదండ్రులు తమ పిల్లలకు నిర్దేశించే క్రమశిక్షణా నిర్దేశాలను వారు వర్ణించటం ఎంత బాగుందో! బీదరికమంటే డబ్బు లేకపోవటం కాదు. మరేది? “తనకు కలుగుదాని తనవారికిని పంచి మోదమందకున్న పేదతనము!” అని గొప్పగా నిర్వచించినారు అనంతకృష్ణ గారు. ఆలుమగల మధ్య అనురాగము మాత్రమే ఉంటే సరిపోదు.

'నమ్మకమ్ములేక నరకమ్ము దిగివచ్చు, ఆలుమగల నడుమ నగ్గిపెట్టు, మనసు మలినపడిన మరి శుభ్రపడదంట!' అని అక్షరసత్యాన్ని వెల్లడించినారు. అత్యాశకు పోయి అప్పులు చేసి తాము కష్టములలో చిక్కి, కుటుంబాన్ని వీధిపాలు చేసేవారు వెధవలు. దేవాలయాల వంటి ఆసుపత్రులను నరకకూపములకు నకళ్ళు గా చేసిన వారని వెధవలన్నారు కవి. 'మాటతూలువారి మనుషు లనగలేము, మాట బాధపెట్టి చేటు చేయు' అని నిష్కర్షగా చెప్పినారు. తమ స్వార్థం కోసం 'నాల్క చివరి మాట నమ్మబల్కగ దిట్ట, కాలు జుట్టు పట్టు వీలువెంట, గెలుచు పార్టిలోకి గెంతువారల' చూపి ఇటువంటి నాయకులు వెధవలని వీళ్ళ బారిన పడరాదని హితవు బలికినారు.

ఇది ఒక విలక్షణమైన శతకము. పేరు చూసి దీనిని తేలికగా తీసుకోలేము. పద్యాలను చదవటం మొదలుపెడితే చివరి పద్యం చదివేదాకా ఆగలేము. ప్రతిపద్యము రసగుళిక.

ఈ శతకంలో శ్రీ అనంతకృష్ణ గారు వెధవలంటే ఎవరో నిర్వచించి వారి నుంచి దూరంగా ఉండమని ప్రబోధిస్తూనే మనం జీవితంలో పాటించవలసిన మంచి విధానాలను పద్యాలలో పొందు పరచినారు. అందువలన ఇది ఒక చక్కని నీతి శతకము కూడా. సమాజ సంక్షేమానికి, ఆరోగ్యానికి ఇటువంటి ఆసక్తిగా చదివించే చక్కర పూత పూసిన చేదుమాత్రాలు చాలా అవసరం.

శ్రీ అనంత కృష్ణ గారికి నా అభినందనలు తెలియజేస్తున్నాను.

కరీంనగర్

తేదీ 19-03-2021 **వి. ఆర్. గణపతి**

## శతకం భేషుగ్గా ఉందండోయ్! వెధవది.

అయ్యా! ఏమీ అనుకోమాకండి. మాటకి ముందు ఈ వెధవది అనే మాట వాడటం మా పూర్వీకుల సంప్రదాయం. అదే. ఊతపదం. మా పూర్వీకుల శ్రోత్రియత్వాన్ని గౌరవించినప్పుడు ఈమాత్రం వెటకారపు అలవాటుని కూడా గౌరవిస్తే, అనుకరిస్తే నాకదొక తుత్తి అన్న మాట. మా పెద్ద వాళ్ల మాట తీరు ఈ మధ్యన పోయి "నాన్సెన్సు,బ్లడీ" మొదలైన ఇంగ్లీష్ ముక్కలు అఘోరిస్తున్నా యనుకోండి. అవ్వీ ఈ "వెధవ"లాంటివే. మా పూర్వీకు లిద్దరు ఒక పెళ్లి చేయించటానికి పోయారు ష. వాళ్లలో పెద్దాయన "ఒరే!అవధానీ!ఈ పెళ్లికూతురు పిల్లముండ మాత్రం లక్ష్మీ దేవి లాగా కళగా ఉందిరా. వెధవది" అనాట్ట. "అదేంటి మామా!శుభమా! అని పెళ్లి కొచ్చి అట్లా అంఛావ్!" అన్నాట్ట కుర్ర పురోహితుడు. "నేనేమీ తప్పు అనలేదోయ్! అసలు వెధవది అంటే వెయ్యేళ్లు ధనం తో వర్ధిల్లేది అని అర్థం"అనాట్ట పెద్ద పురోహితుడు. అలాగే మన అనంతకృష్ణ గారు శతకానికి వెధవశతకం అని పేరు పెట్టటం మంచి సంప్రదాయపద్ధతి లోనే ఉంది. బహుశః సంప్రదాయం తెలిసిన ముండావాణ్ని అనే నమ్మకం తో నేమో దీని మీద నన్నొక సమీక్ష అఘోరించ మన్నారు. ఆ గౌరవం ఎవరు పడితే వాళ్లకి ఇస్తారా ఏమిషి.?

ఇక శతకం లోని విషయానికి వస్తే-"వీరి పాల బడుట వెధవ లగుట"అనేది చాలా అర్థవంతంగా ఉంది. ఇక్కడ కవి గారు ఎవరినీ వెధవ అని తిట్ట లేదు. ఫలానా రకం అప్రాచ్యుల్ని నమ్మితే వెధవ లౌతారు అని ఉపాయంగా చెప్పారు. ఇవి ముఖ్యంగా మన కుర్ర వెధవలకి పనికొచ్చే మాటలే. మకుటం అంటే ప్రతి పద్యం లోనూ ఒక పాదంగా వస్తుంది కాబట్టి, అది బాగుంది కాబట్టి నూటికి పాతిక పాళాలు అమోఘంగా ఉన్నట్టే గా!ఇక నేను అఘోరించాలిసిందల్లా మిగిలిన ఆ ముప్పాతిక పాళ్లు ఎలా ఉంది?అనేదే. అదీ బానే ఉంది. బడుల్లో మన బొట్టికాయిలు పడే తిప్పల్ని ఎంత కళ్లక్కట్టినట్టు చెప్పారు! 2 వ పద్యం"నేర్పు లేని వాడె నేర్పు వాడు"అని

చెప్పటమే గొప్ప నేర్పు. 4 వ పద్యం పాఠాలు చెప్పాల్సిన పంతుళ్లు పాకశాస్త్ర పండితుల్టండోయ్! అవును. పొద్దున లేస్తే పిల్లాళ్లకి మధ్యాన్న భోజనం వగైరాలు చూట్టానికే సరిపోతుంటే ఇంకా చదువేం చెపుతాడు?అని చమత్కరించారు. ఇప్పటి పిల్ల సన్నాసుల గురించి రాస్తూ 10 వ పద్యం లో పెద్దముండావాళ్లని గౌరవించక అంతా తమకే తెలుసని విర్రవీగే పిల్ల వెధవల్ని "తాము తప్పు చేసి తమ కీడు నెరుగని"అని మందలించటం మంచి పెద్దరికంగా ఉంది. 14 వ పద్యం లో "వయసు మీరి నంత వా రేమి చేతురు" అనే జాలి లేక వాళ్లింకా ఏదో కష్టపడాలని భావించే బిడ్డల మనస్తత్వాన్ని వర్ణించటం చూస్తే ఎంత పెంకె పోరగాళ్ల కైనా మంచితనం వొస్తుంది. 15 వ పద్యం లో పెద్దాళ్ల కట్టుబాట్లు తీగకి దారం కట్టి పైకి తేవటం బాపతు ప్రయత్నమే కానీ అదేదో దూడని గుంజకి కట్టెయ్యటం లాంటి దని ఏడవకండిరా!అని కుర్ర వెధవలకి నచ్చ జెప్పటం బాగుంది. "నీతివాక్యా లన్నీ పిలగాళ్ల కేనా ఏమిషి? అక్కడికి పెద్దాళ్లంతా శుద్ధమేనా?" అన్నట్టు పెద్దాళ్లకీ కొన్ని చురక లేశారు లెండి."పోరగాళ్లు పెద్దాళ్లవుతుంటారు కదా! వాళ్ల యిష్టం ప్రకారమూ కాస్త ఏడవనిద్దాం" అనుకోక "ఎప్పటికీ మా అధికారమే ఉండా" లని పెద్దా ళ్లనుకోటమూ చాదస్తపు గోలే అనే ముక్క 19 వ పద్యం లో చెప్పి పారేశారు. ఇక మొగుడూ పెళ్లాల గోలనీ వదలకండా మన కవి గారు దాన్లోనూ వేలెట్టారు. 32 వ పద్యం లో "మీ అమ్మ,నాన్న ఎలాంటి వాళ్లో అత్తమామలూ అలాంటి వాళ్లే. వాళ్ల మీద వెధవ చుప్పనాతి తనం తప్పు"అంటూ మా బాగా చెప్పారు. 34 వ పద్యం చూశారూ!"ఎండ మావుల వెంట పరుగెత్తద్దని, తృప్తితో ఉండమనే బోధ నాకు తృప్తిగా ఉంది. ఇక డాక్టర్ల మీద చమక్కులు-37 వ పద్యం లో-"వైద్యో నారాయణో హరిః"అని గౌరవించబడే డాక్టర్లు దానికి తగినట్టు కాక వెధవబుద్ధిని,మితిమీరిన వ్యాపారబుద్ధిని కలిగి ఉండటాన్ని నసాళాని కంటేటట్టు ఎత్తి పొడిచారు. "జబ్బు కాదు లెక్క,డబ్బొక్కటియె లెక్క" అంటూ 45 వ పద్యం లో చక్కగా సాధించారు. రాజ్యాంగం లో వాక్స్వాతంత్ర్యం ఉందని మాకూ తెలుసు

లేవోయ్ ! అది ఉంది కదాని ఊరిఖే వాగెయ్యటమే?అర్థం పర్థం ఉండక్కర్లా?"మాట లాడు వేళ మంచి మాటల తోడ భావమర్థమవగ పలుక వలయు"అని భేషుగ్గా చెప్పారు కాదు మరీ!మాట్లాడే దాన్లో చక్కని అర్థం, సామాజికప్రయోజనం ఉండాలి. పోనీ ఏదో కాస్త చమత్కారం అన్నా అఘోరించాలి. ఏమీ లేని వెధవ వాగుడు వాగితే తిక్క పుట్టదూ! కొందరు రాజకీయనాయకులు,టి.వి.వాళ్లు వాక్స్వాతంత్ర్యం ఉంది కదా అని సమాజహితం చూడకండా అడ్డగోలుగా వాగేస్తున్నా రంటూ కవి గారు చాలా కడుపు మంటతో రాశారు. అలాగే వాట్సాపు,ఫేస్ బుక్కుల్లో అడ్డమైన రాతలు రాసే వాళ్లనీను. ఇక రాజకీయాలు-వీటి దుంప తెగ! 65,66 పద్యాల్లో "ఒకసారి నాయకు డైతే చాలు. ఓటు కోసం నడిచెళ్లిన వాడికి కార్లు,బంగళాలు వొచ్చి ఇక తరతరాలకి కూడబెట్టటమే" అని ఛడామడా వాయించేశారు. మతరాజకీయాలని మతి పోయేటట్టు దులిపేసిన కవి గారు మతము పేరు చెప్పి మంత్రతంత్రాలతో జనాన్ని దోచుకోటాన్ని చక్కగా కత్తిరించారు. అంటే ఖండించారు. అందుకు ఉదాహరణ 77 వ పద్యం. మన కవి గారు ఏ పార్టీ?అని ఆలోచించా కానీ ఏ పార్టీ కాక పోవచ్చు. ఇక అవినీతి ఉంది చూశారూ!దీని సిగ దరగ!82 వ పద్యం చూద్దురూ!"చెట్టు పైకి జూడ చెక్కు చెదరకుండు ,చెట్టు లోన జూడ చెదల పుట్ట"అంటారు."మేడి పండు చూడ మేలిమి గా నుండు,పొట్ట విప్పి చూడ పురుగు లుండు"అనే పద్యం ఠక్కున తట్టట్లేదూ! పోరగాళ్ల దురలవాట్లని గురించి చెప్పిన కవి గారు "సంఘం లోని అన్ని ముదనష్టాలకి ఒక అసలైన కారణం దగ్గరి కొచ్చారు.అది 92 వ పద్యం లో ఉంది."నేటి యువత కిపుడు నిర్దేశకులు లేక "భ్రష్టు పట్టి పోతున్నారు ష.అవును. పూర్వం ఒక గాంధీమహాత్ముడో, ఒక వివేకానందుడో, మరొకరో ఎవరో ఒకరు మార్గదర్శకులు గా ఉండే వాళ్లు. ఈ నాడు ఆ స్థాయి కలవాళ్లు లేరు. ఉన్నా ఒక అడ్డగోలు ప్రజాస్వామ్యం పెరుగుతున్న ఈ కాలం లో వాళ్లనీ లెక్క చెయ్యరు. ఇది అసలు కారణం. "చెప్పేవాడూ లేడు-చెప్పిన వినువాడు లేడు"అనే ఒక సినిమా పాటలో లైను గుర్తు కొచ్చింది. అసలీ శతకం

చూడంగానే నాకు "విధవవు కాకుంటివిగా!వెధవయ్యా!కొర్రకూటి వెంకటరాయా!"అనే చాటు పద్యం గుర్తొచ్చింది. అవును మరి! విధవ ఐతే "ఏదో!దురదృష్టం" అని జాలి పడతాం.కానీ వెధవ ఐతేనే బాధ. ఎవరి పాల బడితే జనం వెధవ లౌతారో వాళ్లని చూస్తే కడుపు మంట కలగటం ఇంకా సహజమే.

అపెండిసైటిస్సో అదేదో కడుపు నెప్పి ఉంటుంది ష.దానికి 24 గంటల్లో ఆపరేషన్ చేసెయ్యాలి ష.అలాగే మన అనంతకృష్ణ కవి గారికి ఈ సమాజం లోని కడుపు నెప్పి వేషాలు చూడంగానే ఆత్రత వచ్చి ఆపరేషన్ చేసినట్టు ఈ శతకం రాసి పారేశారు. అందుకు కవి గారిని అభినందిస్తున్నాను. "వెధవశతకానికి చాదస్తం ముండా వాడి సమీక్ష"అనుకోక మీరు చదివి పిల్ల వెధవల్తో చదివిస్తే వాళ్లు చదివి ఏ వెధవల బారినో పడకండా ఉంటే రాసిన కవి గారికి,చూసిన మాలాంటి వాళ్లకీ ఒక తుత్తి. మాకు ఒళ్లో పడే దేమీ లేదు. వెధవది. మరి ఈ సమీక్ష రాయటానికి నన్ను తగినవాడిగా భావించిన అనంతకృష్ణ గారికి ధన్యవాదాలు.

ప్రజ-పద్యం ముఖపుస్తకసమూహానికి నిర్వాహకులుగా ఉంటూ, ఎంతో మంది తో పద్యకవిత్వం గిలికింప జేస్తూ, పోటీలు కూడా పెడుతూ,ఈశా!భక్తకల్పద్రుమా, బంగారు కొండ లాంటి అద్భుతశతకాలు, అనేకకావ్యాలూ రాసిన శ్రీ అనంతకృష్ణ గారు ఇలాంటి గమ్మత్తైన శతకం కూడా ఒకటి రాశారంటే ఆయన ప్రతిభ, వైవిధ్యం మాటలు కాదండోయ్!

భవదీయుడు

**ధనికొండ రవి ప్రసాద్**

# వెధవ

## అవతారిక

ఆ.వె. శ్రీ గణపతిగారి చిన్ని పద్యము నాకు
స్ఫూర్తినిచ్చె వ్రాయ సూక్తులిట్లు
హెచ్చరించనెంచి హేయభావమతుల
వీరి పాలపడుట వెధవలగుట

ఆ.వె. శంకరార్యుడడిగె సామాజికస్ఫూర్తి
రోజులోన వ్రాయు మోజు నాది
అన్ని కూడి రాగ నందరి మేల్గోరి
జతనమిద్ది 'వెధవ శతక'మంచు

ఆ.వె. మకుటము వినినంత మంచిగున్నది కదా
యనుచు వెంటనుండి యలుపులేక
వ్రాయగలరటంచు పట్వర్ధనుండహో
వెధవ శతకమిట్లు వెలయజేయ

ఆ.వె.	వ్యంగ్య మరసి చూడ వారి ధనమనుచు
భావుకతయు, కల్పన భాషలందు
సాధికారు నడుగ సత్కవి ధనికొండ
ముందుమాట వ్రాసి ముద్దు గూర్చె

ఆ.వె.	ఒక్కరోజులోన నక్కసంతయు కక్కి
వ్రాసినాడనిట్లు చూసి రోసి
కొందరైన మార కొండతభాగ్యమౌ
అమ్మదయయె దక్క నన్యమేమి

ఆ.వె.	ఒక్కరోజులోన నక్కసంతయు కక్కి
వ్రాసినాడనిట్లు చూసి రోసి
కొందరైన మార కొండతభాగ్యమౌ
అమ్మదయయె దక్క నన్యమేమి

ఆ.వె.	పురుషులందు పుణ్య పురుషులు వేరనెన్
వేమనార్యుడెపుడొ వేడ్కతోడ
వారికంజలించి వారిభిన్నులనెంచి
వెధవ శతకమిటుల వెలయజేతు

ఆ.వె.	ఈ శతకము జదివి యింగలంబాయెనా
వాని ఘనత కాదె బట్టబయలు
చేరి పెదవినొక్క చిరునవ్వు విరియుచో
పేర్మి మొక్కవచ్చు పెద్ద కనుక

★★★

సమాజంలో చెడు పెరిగి మంచి అంతరించటం క్షేమదాయకం కాదు. చెడు బారిన పడటం వల్ల నష్టమే గానీ లాభము లేదు. చెడు పెరగటానికి స్వార్థము మూలకారణము. అది ప్రేరేపించేవారి పాల పడుట మనకు మనమే నష్టము చేసుకొనుట అని నా భావన. అలాంటి కొన్నింటిని ఈ శతకములో ప్రస్తావించాను.

# శీర్షికలు

1. విద్యావిధానాలు
2. పిల్లలు
3. పెద్దలు
4. ఆలుమగలు
5. వైద్యులు
6. వాక్ స్వాతంత్ర్యము
7. వార్తాపత్రికలు/మీడియా
8. రాజకీయాలు
9. మతము
10. అవినీతి
11. దురలవాట్లు

వీరి పాలపడుట వెధవలగుట !

## విద్యావిధానాలు

ఆ.వె. విలువలన్ని చచ్చె విద్యకదియె మచ్చ
విషయమింతలేని వీరులైరి
వీడుపంతులైన విద్యార్థి గతియేమి
వీరి పాలపడుట వెధవలగుట 1

ఆ.వె. తాను చదువు 'కొనెను' తాను చదువు నేర్పు
నేర్పులేని వాడు నేర్పువాడు
ఎందుకిట్టి బాధలేర్పడెననకుండ
వీరి పాలపడుట వెధవలగుట 2

ఆ.వె. చూసి చీట్లలోన వ్రాసిన ఫలితమై
చదువు వీనికొచ్చు సగము సగము
బుద్ధి పుట్టిచేరె బోధనావృత్తిలో
వీరి పాలపడుట వెధవలగుట 3

ఆ.వె. పంతులన్నవాడు పాఠమ్ములనుగాక
పాకశాస్త్రమందు పట్టునొందె
పదుల వృత్తులందు పరుగెత్తుచుండెనే
వీరి పాలపడుట వెధవలగుట 4

ఆ.వె. పాఠ్యపుస్తకములు బట్టలు బెల్టులు
అమ్ముటందె వీరి నెమ్మనమ్ము
చదువు తప్ప వీడు సర్వమ్ము సమకూర్చు
వీరి పాలపడుట వెధవలగుట 5

ఆ.వె. ప్రభుత వనరులీయ పైకమ్ముగామార్చి
జేబు నింపుకొనెడి బాబులంట
పిల్లవారి హక్కు పెడదారిలో ఖ్రింగు
వీరి పాలపడుట వెధవలగుట 6

ఆ.వె. ఈయవలసియుండ మేయబూనినవాని
వెతకి బుద్ధినిడక మెతకబడిన
తోడుదొంగలనుచు దోషమెన్నకనుండ
వీరి పాలపడుట వెధవలగుట 7

ఆ.వె. బడికి వెళ్ళకుండ బయట తిరుగువాడు
చదువునందు లేక శ్రద్ధయసలు
భవిత విలువలేదు భాధ్యతలిత్తురే
వీరి పాలపడుట వెధవలగుట 8

ఆ.వె. వాడు చదివెనంచు వీడు చదువబూను
మనసునందు సుంత మమత లేక
వివరమరయకుండ విద్య నేర్చితినను
వీరి పాలపడుట వెధవలగుట 9

వీరి పాలపడుట వెధవలగుట !

## పిల్లలు

ఆ.వె. పెద్దలన్ననిపుడు విలువలిడుట మాని
నేనె గొప్పయనెడి నేటి తరము
తాము తప్పు చేసి తమకీడు నెరుగని
వీరి పాలపడుట వెధవలగుట 10

ఆ.వె. అమ్మనేర్పునంట అణకువగానుంట
నాన్న పెంచు బ్రతుకు నాణ్యతలను
వారి గౌరవించు భావమ్ము మరచుచో
వీరి పాలపడుట వెధవలగుట 11

ఆ.వె. తోటివారికెపుడు తోడుగ నిలిచెడు
గుణము నేర్వ వలయు కొంచెమైన
సాటివారి సుఖము సహియింప లేనట్టి
వీరి పాలపడుట వెధవలగుట 12

ఆ.వె. తనకు కలుగుదాని తనవారికిని పంచి
మోదమందకున్న పేదతనము
కరకు గుండెతోడి కారుణ్యహీనులౌ
వీరి పాలపడుట వెధవలగుట 13

ఆ.వె. వయసు మీరినంత వారేమి చేతురు
వయసులోన శ్రమను పడిన పిదప
వారి దెప్పిపొడుచు వాదమ్ము చేసెడి
వీరి పాలపడుట వెధవలగుట 14

ఆ.వె. తీగ పెరుగు కొరకు తీరుగా దారమ్ము
కట్టినట్లు తనకు కట్టడియని
తెలియక పొగరెక్కి తలిదండ్రులను తిట్టు
వీరి పాలపడుట వెధవలగుట 15

ఆ.వె. కలసి యున్న సుఖము కనలేక విడిపోయి
వేరు కాపురాల వెళ్ళువారు
పెద్దతనమునందు వేదన గూర్చుచో
వీరి పాలపడుట వెధవలగుట 16

ఆ.వె. తాను తినియు తినక తపనతో తినిపించ
పెరిగి తనను చూడ పెడమొగమ్ము
ఇంటిశునకమంత నింగితమ్మది లేని
వీరి పాలపడుట వెధవలగుట 17

ఆ.వె. మంచి బుద్ధి నేర్చి మర్యాదలను నేర్చి
శ్రద్ధ కలిగియుండి చదువు నేర్చి
కులము పేరు నిల్పు గుణమది లేకున్న
వీరి పాలపడుట వెధవలగుట 18

వీరి పాలపడుట వెధవలగుట !

## పెద్దలు

ఆ.వె. పెరిగినారు చిన్న పిల్లలు కారంచు
వారి భవిత రూపు వారికిడక
నేను చెప్పినట్లు నీవు వినమనెడి
వీరి పాలపడుట వెధవలగుట 19

ఆ.వె. వయసులోన చేయు పనుల వయసుడుగ
చేయ కష్టమంచు చెప్పినంత
నిజమునొప్పుకొనక నిందింత్రు కొందరు
వీరి పాలపడుట వెధవలగుట 20

ఆ.వె. ఆలు బిడ్డలందు నన్యాయవర్తన
పనికిమాలినట్టి పనుల చేత
బాధ్యతలను మరచి బరితెగించినవారు
వీరి పాలపడుట వెధవలగుట 21

ఆ.వె. అలవికాని వానినాశించుటే కాదు
అప్పులెన్నొచేసి తిప్పలొంది
ఇంటివారినంత నిక్కట్ల గురిచేయు
వీరి పాలపడుట వెధవలగుట 22

ఆ.వె. ఆడపిల్లలన్న నాంక్షలెన్నియొ పెట్టి
చదువు లేల మీకు చాలటంచు
బాలబాలికలను వ్యత్యాసమును చూపు
వీరి పాలపడుట వెధవలగుట 23

ఆ.వె. ఇల్లు పట్టదసలె యితరులున్ననె చాలు
వారివెంట తిరుగు వీరి మరచి
మెప్పుపొందు కాంక్ష మెండుగా కలవారు
వీరి పాలపడుట వెధవలగుట 24

ఆ.వె. పథ్యమన్న పడదు పట్టదారోగ్యమ్ము
బాధపడుచు తాను బాధ పంచు
నియతి తప్పి నడుచు నిర్లక్ష్యమది మెండు
వీరి పాలపడుట వెధవలగుట 25

ఆ.వె. లేనిపోనివాని లెక్కలేనన్నిటిన్
ఊహలందు పెంచు నూసుపోక
నిజము కాని వాని నిజమని వాదించు
వీరి పాలపడుట వెధవలగుట 26

ఆ.వె. పెద్దలన్న వయసు పెరుగుట కాదని
లోకమంత తనకు లోకమనెడి
పెద్దమనసు లేని పేరాశ పరులైన
వీరి పాలపడుట వెధవలగుట 27

వీరి పాలపడుట వెధవలగుట !

## ఆలుమగలు

ఆ.వె. అత్తమామలన్న నాడబడచులన్న
బయటవారలనెడి భావమేల
ఆలుమగలయందు ఆరీతి యెవరన్న
వీరి పాలపడుట వెధవలగుట 28

ఆ.వె. భార్య భర్తనైన భర్తభార్యను గాని
ఒకరిపైననొకరు మొకము ముడిచి
సందియపడిరేని కుందుదురిరువురు
వీరి పాలపడుట వెధవలగుట 29

ఆ.వె. పిల్లలన్న తమదు ప్రేమకడ్డమనుచు
పిచ్చి భావమొకటి పెరుగజొచ్చె
ఉన్నవారి చూచి యుక్రోషమేదక్క
వీరి పాలపడుట వెధవలగుట 30

ఆ.వె. గొప్పదనపు కొలత కొనితెచ్చు జీతమో
అమ్మనాన్నలిచ్చు యాస్తి కాదు
అవియె కొలతయనుచు అలమటించెడివేళ
వీరి పాలపడుట వెధవలగుట 31

ఆ.వె. అత్తమామలన్న నమ్మనాన్నల సాటి
వారి వీరినొక్క తీరునెంచి
సుఖము పంచకున్న క్షుద్రమా బ్రతుకన్న
వీరి పాలపడుట వెధవలగుట 32

ఆ.వె. "ఇల్లు వేరదెట్టు లిల్లాలె యిల్లన్న"
ఆమెనట్లు గనుట యతని ఘనత
అట్లుకాక వీరు కొట్లాడుకొనుచుండ
వీరి పాలపడుట వెధవలగుట 33

ఆ.వె. కలిగినంతలోన కమ్మగ బ్రతుకుచు
ఎండమావులన్నఎదురుపోక
తృప్తినుండరంట తృషితులు పాపము
వీరి పాలపడుట వెధవలగుట 34

ఆ.వె. ఆశ వలయు కాని యత్యాశ దోషమ్ము
భేదమెరుగకున్న ఖేదమగును
మంచిచెడుగు మరచి మనుషులు వీరౌట
వీరి పాలపడుట వెధవలగుట 35

ఆ.వె. నమ్మకమ్ములేక నరకమ్ము దిగివచ్చు
ఆలుమగల నడుమ నగ్గిపెట్టు
మనసు మలినపడిన మరి శుభ్రపడదంట
వీరి పాలపడుట వెధవలగుట 36

వీరి పాలపడుట వెధవలగుట !

## వైద్యులు

ఆ.వె. విష్ణునంశయంచు వీరిని కొల్తురే
విలువనిలుపుకొనని వెధవలిపుడు
వైద్యవృత్తినొక్క వ్యాపారమును చేయ
వీరి పాలపడుట వెధవలగుట 37

ఆ.వె. వేళ్ళపైన నేడు వీలౌను లెక్కించ
మంచివారు ప్రజకు మంచిచేయ
తగరు వైద్యులనగ తద్భిన్నులెందరో
వీరి పాలపడుట వెధవలగుట 38

ఆ.వె. ఆసుపత్రులన్న నసువుల పీడించు
నరకకూపములకు నకలులాయె
ధర్మచింతనమ్ము తగుమాత్రమును లేదు
వీరి పాలపడుట వెధవలగుట 39

ఆ.వె. డబ్బు దండుకొనుట జబ్బుబట్టియె కాదు
రోగి భయముబట్టి రొక్కమడుగు
ప్రాణమేమిగాని పైకమ్మె ముఖ్యమ్ము
వీరి పాలపడుట వెధవలగుట 40

ఆ.వె. రకరకమ్ములంట రక్తపరీక్షలు
ఖర్చు వేలలోన కళ్ళుతిరుగ
వైద్యమన్నపేర వడ్డనల్ లక్షలే
వీరి పాలపడుట వెధవలగుట 41

ఆ.వె. వనరులుండి కూడ వసతులు లేనట్టి
ప్రభుత పెట్టునట్టి వైద్యశాల
లంచగొండితనము లౌల్యమశ్రద్ధయున్
వీరి పాలపడుట వెధవలగుట 42

ఆ.వె. భయము బాపరసలు భయపెట్టుటయు కద్దు
పాపభీతి లేదు భయములేదు
జలగ సిగ్గుతోటి చావచూచినదంట
వీరి పాలపడుట వెధవలగుట 43

ఆ.వె. 'కార్పరేటు' పేర కాల్చుకు తిందురు
'మార్కెటింగు' కొరకు మనుషులంట
'బిల్లు'లోన కొంత చెల్లింపులు కలవు
వీరి పాలపడుట వెధవలగుట 44

ఆ.వె. తగ్గ పనియు లేదు ధనము తగ్గినచాలు
విడిచిపెడుదురొక్క ఘడియలోన
జబ్బుకాదు లెక్క డబ్బొక్కటియె లెక్క
వీరి పాలపడుట వెధవలగుట 45

వీరి పాలపడుట వెధవలగుట !

## వాక్ స్వాతంత్ర్యము

ఆ.వె. మాటలాడువేళ మంచిమాటల తోడ
భావమర్థమవగ పలుక వలయు
నట్లుగాక వదరు నప్రాచ్యులెందరో
వీరి పాలపడుట వెధవలగుట 46

ఆ.వె. మాటలాడుటందు మాకు హక్కు కలదు
నోటిమాట మాది నోరు మాది
రచ్చచేతురేల రాజ్యాంగ హక్కను
వీరి పాలపడుట వెధవలగుట 47

ఆ.వె. మాటలాడ నాదు మౌలికమౌ హక్కు
కాదు పొమ్మనుటకు లేదు హక్కు
పట్టి హక్కు పదము బాధ్యతల మరచు
వీరి పాలపడుట వెధవలగుట 48

ఆ.వె. మాట మంత్రమౌను మంచిపంచెడి వేళ
మాటవిషము చిమ్మ మనసు విరుగు
మాటకున్న శక్తి మరిచి వాగుచునుండ
వీరి పాలపడుట వెధవలగుట 49

ఆ.వె. పదవులందునుండ బాధ్యతాయుతులౌచు
పలుకు విలువ తెలిసి పలుకనట్టి
దుష్ట భావపూర దోషబుద్ధులు వీరు
వీరి పాలపడుట వెధవలగుట 50

ఆ.వె. సాధ్యపడదు హక్కు బాధ్యత లేకున్న
వెర్రివాగుడేల బెరుకులేక
బాధ్యతలను మరుచు పొరులే మూర్ఖులు
వీరి పాలపడుట వెధవలగుట 51

ఆ.వె. మాట మీరినంత మనసు గాయపడును
మాట బాధపెట్టి చేటు చేయు
మాటతూలువారి మనుషు లనగలేము
వీరి పాలపడుట వెధవలగుట 52

ఆ.వె. పదవి పొగరుతోడ పరమ బూతులు తిట్ట
తిక్కచేతలగును హక్కు కాదు
కళ్ళు నెత్తికెక్క కర్కోటకులు వీరు
వీరి పాలపడుట వెధవలగుట 53

ఆ.వె. అర్థరహితభాష లడుగంటె విలువలు
వయసు మరిచిపోవు ప్రల్లదనము
గర్వము తలనున్న ఘన ధూర్తచిత్తులౌ
వీరి పాలపడుట వెధవలగుట 54

వీరి పాలపడుట వెధవలగుట !

## వార్తాపత్రికలు/మీడియా

ఆ.వె. చెప్పనలవి కాని చేటు వ్రాతలతోడ
నేవిచక్షణన్న నెరుక లేక
పాత్రికేయులిపుడు వ్రాతురే మితిమీరి
వీరి పాలపడుట వెధవలగుట 55

ఆ.వె. చర్చలన్నపేర ఛండాలముల జూపు
రెచ్చగుట్టునట్లు ముచ్చటాయె
టీవిగాను నేడు 'టీవి' ఛానళ్ళలో
వీరి పాలపడుట వెధవలగుట 56

ఆ.వె. శోషవచ్చునట్లు సోషలు మీడియా
దుమ్ముెనెత్తి పోయ దొరికె నేడు
ఉచ్చనీచమరయ నూసుకైననులేదు
వీరి పాలపడుట వెధవలగుట 57

ఆ.వె. వార్తలైనగాని వారఫలములైన
'పార్టి'కనుగుణముగ వ్రాయుచుండు
వేరుపత్రికలను వేర్వేరుగా వ్రాయు
వీరి పాలపడుట వెధవలగుట 58

ఆ.వె. తాము వ్రాయునపుడు తమబాధ్యత మరచి
ఇష్టమొచ్చినట్టు లింత చెత్త
నింపు విలువలేని కంపు పంచెడివారు
వీరి పాలపడుట వెధవలగుట 59

ఆ.వె. దుష్టభావజాల దుర్బోధ కిరవులై
పచ్చదనము పంచి వరలునట్టి
మాధ్యమాలవారు మానహీనులుగాన
వీరి పాలపడుట వెధవలగుట 60

ఆ.వె. ట్విట్టరంట చూడ ఫేసుబుక్కులునంట
దుమ్మునెత్తిపోయు ధూర్తులకును
వాటుసప్పులంట వాడి పిన్నులనంట
వీరి పాలపడుట వెధవలగుట 61

ఆ.వె. తాను తిట్టవచ్చు తనను తిట్టగరాదు
బూతుమాట తోచు రీతి పదము
నిష్టురతను తెలుప నిస్సిగ్గుగావాడు
వీరి పాలపడుట వెధవలగుట 62

ఆ.వె. భాష శైలి మారె భావప్రకటనలో
సత్యపూర్ణ భాష చాటుకాయె
తాము చేయు కీడు తామేల తలపరో
వీరి పాలపడుట వెధవలగుట 63

వీరి పాలపడుట వెధవలగుట !

## రాజకీయాలు

ఆ.వె. దేశ భవిత కొరకు దేహభావమువీడి
వారు పోరినారు పాతవారు
దేశభక్షణమ్ము దేహార్థమనుచుండ
వీరి పాలపడుట వెధవలగుట 64

ఆ.వె. ఇంట నేతయుండ నింకేమి కావలె
వాడు, వాని సంతు, వారి సంతు
తరతరమ్ములిట్లు తమదౌను దేశమ్ము
వీరి పాలపడుట వెధవలగుట 65

ఆ.వె. నడిచి వెళ్ళి ఓటు నడిగిన నేతలు
గెలిచినంత మారు గృహపు వాస్తు
కార్లువచ్చు, కండ కావరమ్మును వచ్చు
వీరి పాలపడుట వెధవలగుట 66

ఆ.వె. తెలుపు వలువలంట నలుపు మనసులంట
పరుగుపెట్టునంట సిరులవెంట
తాను చేయు పనులు తన లబ్ధికోసమే
వీరి పాలపడుట వెధవలగుట 67

ఆ.వె. నాల్క చివరి మాట నమ్మబల్కగ దిట్ట
కాలు జుట్టు పట్టు వీలువెంట
స్వార్థమొకటె కలదు సాహాయమనిపేరు
వీరి పాలపడుట వెధవలగుట 68

ఆ.వె. బేలచూపు చూచు బెదిరించు ఘనుడైన
పోర సిద్ధమైన వీర తతులు
వలయుదానిపొందు బలవంతముగనైన
వీరి పాలపడుట వెధవలగుట 69

ఆ.వె. మనసులోనన్న మాట నెరుగనీడు
పెదవిపైన నవ్వు వదలడసలు
మేడిపండుకితడు మేలైన పోలిక
వీరి పాలపడుట వెధవలగుట 70

ఆ.వె. రాజకీయమన్న రాళ్ళముళ్ళనునంట
కోట్లు కోట్లు ధనము కొల్లగొట్టి
తెలియకుండదాచ తెగ కష్టమనువాడు
వీరి పాలపడుట వెధవలగుట 71

ఆ.వె. ప్రజల కొరకునంచు పనికట్టుకుని చూప
చేతకాని పనుల చేయువాడు
అసలు పనులు తప్ప నన్ని చేసెడివాడు
వీరి పాలపడుట వెధవలగుట 72

వీరి పాలపడుట వెధవలగుట !

## మతము

ఆ.వె. మతము పేర చిచ్చు మనమధ్యలో పెట్టి
కొట్టుకొనగ చేసి ఘోరగతుల
మమతలన్ని చీల్చు కుమతుల గమనించు
వీరి పాలపడుట వెధవలగుట 73

ఆ.వె. తప్పుపనులు చేసి తప్పించుకొన జూచు
దుష్టబుద్ధికపుడు దొరకు మతము
మతపు చిచ్చునందు మనదృష్టి మరలించు
వీరి పాలపడుట వెధవలగుట 74

ఆ.వె. మతము సమత నేర్పు మనుషులుగా చేయు
వరలు మనకు మతము వ్యక్తిగతము
దుర్మతులకు మతము వర్మమాయుధమును
వీరి పాలపడుట వెధవలగుట 75

ఆ.వె. మతము పేరు చెప్పి మాత్సర్యముల పెంచి
ఒకరికొకరు కాక నుండచేసి
పబ్బము గడుపుకొను పాతకులుండిరే
వీరి పాలపడుట వెధవలగుట 76

ఆ.వె. మతము పేరు చెప్పి మంత్ర తంత్రమనుచు
మనదు స్వార్థబుద్ధి మనుగడగుట
మంచి యదను చూసి వంచకులై వచ్చు
వీరి పాలపడుట వెధవలగుట 77

ఆ.వె. మతములెన్నియున్న మనుగడ యొక్కటే
పేరు మార్పుతప్ప తీరులొకటె
తత్త్వదృష్టినుండి తప్పించి దూషించు
వీరి పాలపడుట వెధవలగుట 78

ఆ.వె. మతము లక్ష్యమైన మానవత్వము పెంచు
మూలభావముడిగి మూర్ఖులౌచు
నల్పమతులు చేయు నన్యాయములు చూడు
వీరి పాలపడుట వెధవలగుట 79

ఆ.వె. మతములన్ని చెప్పు మంచిమాటలొకటె
భిన్నపదములందునున్నదొకటె
కాని దుష్ట చేయు గ్లానులెన్నెన్నియో
వీరి పాలపడుట వెధవలగుట 80

ఆ.వె. కళ్ళు తెరిచి చూడ కన్పట్టు దోషమ్ము
పరులు చెప్పు మాట పరిగణించ
నష్టమెంతొకలుగు నామాట నమ్ముడీ
వీరి పాలపడుట వెధవలగుట 81

వీరి పాలపడుట వెధవలగుట !

**అవినీతి**

ఆ.వె. చెట్టుబయట చూడ చెక్కుచెదరకుండు
చెట్టులోన చూడ చెదల పుట్ట
ముట్టినంత చాలు మూలమ్ము తో కూల్చు
వీరి పాలపడుట వెధవలగుట 82

ఆ.వె. నేను తప్ప వేరు నేచూడగా లేక
నన్ని నాకె వలయునన్నవాడు
ఆదిపురుషుడందునతడవినీతికి
వీరి పాలపడుట వెధవలగుట 83

ఆ.వె. స్వార్థమావరించు చర్యలౌనవినీతి
కారణమ్ములన్ని కల్లలందు
తొలుత కొంతనుండి తొలుచు వ్యవస్థలన్
వీరి పాలపడుట వెధవలగుట 84

ఆ.వె. అవసరమనిపించు నటుపైన నలవాటు
హక్కుగానడుగుట కాశపుట్టు
నీయకున్ననలుగు నిబ్బందులనుపెట్టు
వీరి పాలపడుట వెధవలగుట 85

ఆ.వె. వావి వరుస లేక పరులుగా చూచేను
అక్రమార్జనమ్మె యతని బుద్ధి
సిగ్గుపడడు చూడ ఛీయన్న థూయన్న
వీరి పాలపడుట వెధవలగుట 86

ఆ.వె. బిడ్డపుట్టినపుడు పెరిగి బడికి వెళ్ళ
లంచమడుగుచుంద్రు లక్షణముగ
పై చదువుల వేళ పలుతావులీరీతి
వీరి పాలపడుట వెధవలగుట 87

ఆ.వె. లంచమడుగు వేళ కొంచెమైనను సిగ్గు
లేక నడుగువాడు లేకిగాను
శుద్ధమైన తిండి శూన్యమవ్వానికి
వీరి పాలపడుట వెధవలగుట 88

ఆ.వె. లంచమడుగుగాని లంచమివ్వడు వాడు
దండుకొనుట తెలుసు దయను మరచి
దుర్భరమ్ము వీడి తోడ సాంగత్యమ్ము
వీరి పాలపడుట వెధవలగుట 89

ఆ.వె. దేశ ప్రగతి కోరి దేబిరించెడి వీరి
పార ద్రోలవలయు పట్టుబట్టి
యట్లు చేయకున్న నాపాపమంటుగా
వీరి పాలపడుట వెధవలగుట 90

వీరి పాలపడుట వెధవలగుట !

## దురలవాట్లు

ఆ.వె. జీవితమ్ముపైన స్థిరచిత్తమది లేక
తప్పు దారులందు తాము నడిచి
బాధ పడుచు మనల బాధల పెట్టరే
వీరి పాలపడుట వెధవలగుట 91

ఆ.వె. నేటియువత కిపుడు నిర్దేశకులు లేక
దారి తప్పి నడుచు వారలైరి
ద్వేషచిత్తులంత వీరివెంట పడిరి
వీరి పాలపడుట వెధవలగుట 92

ఆ.వె. దేశ భక్తి లేక తీరుతెన్నులు లేని
బ్రతుకులైన వారు భవిత మరిచి
ద్రోహచింత తోడ దోషవర్తనులైరి
వీరి పాలపడుట వెధవలగుట 93

ఆ.వె. భూతదయయులేని భూస్వాములెందరో
బీదవారి శ్రమను పీల్చు వారు
కష్ట పడెడు వాని కడుపు గొట్టెడు వారు
వీరి పాలపడుట వెధవలగుట 94

ఆ.వె. శత్రువులను కూడి సామరస్యము కూల్చ
యువత మనసు మార్చు యోచనలట
అమ్మరొమ్ముగుద్దు నప్రాచ్యులట వీరు
వీరి పాలపడుట వెధవలగుట 95

ఆ.వె. నోటు తీసుకొనియె వోటు వేసెడివాడు
పనికిరాని వాడు పాలకుడగు
పెట్టుబడిని పొందు పేరాశ వాడౌను
వీరి పాలపడుట వెధవలగుట 96

ఆ.వె. గెలుచు పార్టిలోకి గెంతువారల చూడ
వారి స్వార్థమంత బయలు పడదె
సేవ చేయు నట్టి చింతయే లేనట్టి
వీరి పాలపడుట వెధవలగుట 97

ఆ.వె. మనదు రక్తమంది మంచి పుష్టిని పొందు
నల్లి దోమ జలగ నాయకులిట
తెగబలిసినవారు దీనులితరులైరి
వీరి పాలపడుట వెధవలగుట 98

ఆ.వె. కష్టకాలమందు కావలె ధైర్యమ్ము
దాని తొలగజేయు దారి వెదుక
దోషమెన్నకున్న తొలగజేయుటదెట్లు
వీరి పాలపడుట వెధవలగుట 99

వీరి పాలపడుట వెధవలగుట !

ఆ.వె. కలము నెంచుకొంటి ఖడ్గమ్ముగా నేను
కనులముందు సాగు కష్టములకు
కారణమ్ములైన కక్కూర్తి చూపంగ
వీరి పాలపడుట వెధవలగుట 100

★★★

వెధవల శతకం వ్రాసిన
వెధవాయికి బుద్ధి నిచ్చు వెన్నుడు దయతో,
వెధవల కందరకీ యిది
విధి వ్రాసిన వ్రాతలనుచు వివరింపగన్!!!

శ్రీ చొప్పకట్ల సత్యనారాయణ,
ప్రముఖ సంస్కృతాంధ్ర పండితులు

---

వెధవలు శతకానికే సరిపోయారా? మొదటి మూటకావచ్చు.
ముందుగా అభినందనలు.

శ్రీ కాటేపల్లి లక్ష్మీ నరసింహమూర్తి,
పద్యకవి

---

వెధవ లెవరటంచు వెతికి వేసారగా
కవన దర్పణాన కానవచ్చె

శ్రీ డి.కే. రామారావు,
పద్యకవి

---

వెధవలపై శతకమ్మును
విధిగా వ్రాయంగబూన, వేగమె కొదువా?
బుధుడా "నన్నును నన్నని"
వెధవలు వచ్చెదరు తలపు, వేలకు వేలున్

శ్రీ గోలి హనుమచ్ఛాస్త్రి,
వ్యంగ్య పద్యకవి